# రాఘవేశ్వరశతకము.



బాలకవి,

సామవేదుల వేంకటశాస్త్రి.

శ్రీరస్తు.

ఓం నమః కామేశ్వర్యై.

శ్రీ

# రాఘవేశ్వర శతకము.

కృతికర్త:

బాలకవి,

## సామవేదుల వేంకటశాస్త్రి,

(తగరంపూడి)

పరిశోధకులు:

ఉభయభాషాప్రవీణ, అష్టావధాని,

## వడ్డాది సీతారామాంజనేయులు గారు,

ఖాశింకోట.


శ్రీ బలరామకృష్ణా ముద్రణాలయము,

అనకాపల్లి.

1937.


 [వెల 2 అణాలు

# తొలిపలుకు.

"మానక కర్మభూమిపయి మానుషదేహముతో హితాహిత
జ్ఞాన మెఱుంగు బ్రాహ్మణుఁడు చారుకవిత్వము నేర్చి జానకీ
జానికథల్ రచింపక యసత్కథ లెన్ని రచించె నేనియున్
వాని వివేక మేమిటికి? వానికవిత్వ మహత్వ మేటికిన్?"

ఏమహాపురుషుని జీవితచరిత్ర ననేకకవులు పద్యములుగ, గద్యములుగ, గేయములుగ రచించి ఆసుందరమూర్తి నామామృతముగ్రోలి ధన్యతనొందినారో, ఆలోకైకవీరునిమహిమ " రాఘవేశ్వరా! " అను మకుటముతో ఈశతక కర్త ప్రప్రథమముగ రచించుట యెంతయు శుభసూచకము ఈకృతికర్తలగు బ్రహ్మశ్రీ సామవేదుల వేంకటశాస్త్రిగారు బాలకవులు, ఉత్సాహవంతులు, విద్యార్థి దశయందున్నారు. ఆంధ్రభాష యందీయనకు నెక్కువమోజు. శైలిసులభము. అర్థమా? గంభీరము.

మా మిత్రులు ఉభయభాషాప్రవీణులు, అష్టావధాని బిరుదాంచితులు శ్రీ నడ్డాది సీతారామాంజనేయులుగారీకావ్యమునకు మెఱుగుపెట్టిరి.

ఈపొత్తమును జదివి ఈయువకుడింకను రమణీయకావ్యములు రచించునట్లు ప్రోత్సహింప నాతెలుగుతోబుట్టువులనెల్లరను సదా ప్రార్థించుచున్నాను. తమ తొలిబిడ్డ తొలిపలుకు నాలేఖినీముఖమున బలికించినందులకు శాస్త్రిగారికి నేనెంతయు కృతజ్ఞుడను.

అనకాపల్లి.
ది1—2—37.

గ్రంధి వెంకటరమణయ్య,
సత్యవాణి సంపాదకులు,

శ్రీరస్తు.

శ్రీరామాయనమః

# శ్రీ రాఘవేశ్వర శతకము.

శ్రీజనకాత్మజాహృదయ । సింధుసుధాకర! రామచంద్ర! ని
ర్వ్యాజకృపాకటాక్షపరి । పాలిత సంశ్రితలోక! కీర్తి వి
భ్రాజిత! రావణాద్యసుర । వారవినాశక! మానిమానసాం
భోజనివాస! వాసవ వి । భుత్వసముజ్జ్వల! రాఘవేశ్వరా!

ఉ॥ శ్రీరఘువంశదీప! నృప । శేఖర! తారకనామ! భక్తహృ
త్సారసమిత్ర, యోత్రిదశ । సన్నుత! యవ్యయ! యప్ర
మేయ! నీ
కూరిమిఁగోరిపద్యములఁగూర్చెద। నీపయిఁద్వత్కృపాసుధా
సారమునాపయిన్ జిలికి । సాఁకవెనిత్యము; రాఘవేశ్వరా!

ఉ॥ వాకులు సార్థకంబగుచు । భాసిలునట్లుగఁబుణ్యమూర్తి వా
ల్మీకిమహర్షిసత్తముఁడు । లీలఁగఁబాడెనుగాదె? తొల్లి యి
క్ష్వాకులదివ్యగాథలుఁబ । వచ్చరితల్ భవతారకంబుగన్
గోకిల యవ్వసంతమునఁ । గోర్చెడుభంగిని రాఘవేశ్వరా!

ఉ॥ పేరికట, మద్వితీయమును, । భవ్యమునాఁగతి పోతరాజుచే
వాకొనఁజేసినాఁడుగద । భాగవతమ్ము; నతండుమున్ను మా
రాకునుహత్తఁజేయుటని । రమ్యవిచిత్రకవిత్వవైభవ
శ్రీకొనసాగె; నిన్ గొలువఁ । జేకురునన్నియు;రాఘవేశ్వరా!

ఉ॥ "వీఁడుతురుష్కుఁ"డంచును వి। భేదము సేయక యే,"కబీరునా
వాఁ" డని వత్సలత్వమున। బాలనసేయుచు, నెల్లలోకముల్
పాడఁగ నీదుభక్తపరి । పాలనదీక్షను జాటవా? కృ
పాడెడుపట్టునన్ గలవె । వాసియు, వారయు?రాఘవేశ్వరా!

చ॥ పెనుధృతి రామమంత్రముఁగ । బీరునిచే నుపదేశమంది గో
పనకవి, రామదాసనెడి । సార్థకనామమునందుచున్ వినూ
తనగతిమాధురుల్ చిలుకు । దాశరథీశతకమ్ముఁజెప్పె; నీ
ఘనకృపయున్న చోఁగొలఁదిఁ । గల్గునె యెందును?
రాఘవేశ్వరా!

చ॥ అమరఁగవాయుపుత్రుఁ డను।యాయులతోఁజనుదెంచినీచరి
త్రముపఠియించుతావునము । దాసవసించునఁటన్నమాట స
త్యము;విని నాముగా, తులసి । దాసకవీంద్రుఁడునీకథల్ పురా
ణముగఁబఠించుచో నిటులె । నాఁడొనఁగూడెదె?
రాఘవేశ్వరా!

ఉ॥ కాకరపర్తిగ్రామమునఁ । గాఁపురమొప్పఁగ సర్వపండిత
శ్లోకుఁడునై, సుధీవిభవ । శోభియునై, బహుశిష్యసేవిత
శ్రీకమనీయపాదుఁడయి । చెల్వగువేమలరామశాస్త్రులన్
బ్రాకటభక్తి మ్రొక్కెదను। భంబెదఁగోరుచు రాఘవేశ్వరా!

ఉ॥ ధీరవరేణ్యు లందుసము । దీర్ణతఁగాంచిననాయకుండ, వె
వ్వారుగణింపకుండఁగల । వారుభవచ్చరితమ్ముఁ? గ్రొత్త, జె
ల్వారురసజ్ఞకున్ ఫలము । నారయ నుత్తమవర్ణనంబెయగాఁ
గా? రుచిరంబుగాఁగశత । కంబిదెకూర్చితి రాఘవేశ్వరా!

చ॥ కటికదుకాణదారుఁడును, । గన్యలనమ్మెడువాఁడు, కావ్యసం
పుటములనంకితమ్మొనెడు । బొంకునదేవునివీడిదేహాలం
పటునకునిచ్చువాఁడు, గురు। పాదముఁదప్పినవాఁడు, ఘోరసం
కటమునుగూర్చుపుండ్లుగద । కావ్యపికక్కట! రాఘవేశ్వరా!

ఉ॥ ఒక్కఁడు వేదసంతల, నిఁ । కొక్కఁడువ్యాకరణప్రసక్తి, వే
ఱొక్కఁడుతర్కశాస్త్రమునఁ। నూరకచర్చలుసేయుచుండు రా
ఘక్కనిఁగప్పలట్లుకడు । వాగిననేమి ఫలంబు? త్వత్కృపా
భాక్కులుగాఁగనీకథలు । వర్ణనసేయక రాఘవేశ్వరా!

ఉ॥ శక్తికొలందినీపయిని । సత్కృతులఁ రచియించుకొంచు, న
వ్యక్తభవన్మహత్త్వపరి । పాకమునాకమృతంబుగాఁగ, నీ
భక్తుఁడనై మెలంగెదను । బ్రాంజలిఁబట్టుచు, నాంజనేయునా
సక్తిసిఁబో్రిచినట్లునను । సాఁకుమునిత్యము రాఘవేశ్వరా!

ఉ॥ తీరుగభక్తివిత్తమి । దేమొలకెత్తెను, నాదుచిత్తకే
దారమునందు నెట్లొటులొ; । త్వత్కరుణామృతవృష్టినింపవే
వేరుబఁదన్ని, వృక్షమయి, । పిందెలఁగాయలఁబండ్లమించిపెం
పారునుభక్తపాంథహృద । యమ్మునలర్చును; రాఘవేశ్వరా!

ఉ॥ పాటలుపాడికొందఱును, । బద్యకృతుల్ రచియించికొందఱుౘ
నాటకముల్ ప్రదర్శనమొ। నర్చుచుఁగొందఱు నీచరిత్రముౘ
గోటివిధాలలోకమునఁ । గుప్పిరి; దానిమనోహరత్వమే
పాటిదొకాని తృప్తికను । పట్టదునేఁటికి రాఘవేశ్వరా!

చ॥ ఘనతరభక్తి నాహృదయ । కంజమునందుఁ బ్రవాహరూపమై
వినుతభవత్పదద్వయము । వేడుకతోడ సమాశ్రయింపఁ, బ్రో
వను నరికట్టు దుర్విషయ । వాంఛల నన్నిటి నెట్టుకొంచు, హె
చ్చినత్వరవచ్చెఁ బొంగుచును। జేకొను మీకృప రాఘవేశ్వరా!

ఉ॥ కాలయముండు పాశమును । గంఠమునన్ బిగియించు వేళ, నా
కాలును జేయియున్ బిగిసి । కట్టెలతో సమమైన వేళ, నా
నీలఘనస్వరూపివగు । నిన్నుఁ దలంపఁగ లేనుగాన ని
వ్వేళ నె, బాల్యమందె నిను । వేఁడెదఁ బ్రోవుము రాఘవేశ్వరా!

చ॥ తెరలనిభక్తి నిప్పుడె, ను । తింపఁగ నిన్ను నినున్ బరాకుచే
మఱచునొ లేక నామనము। మానక నిన్ స్మరియించుచుండునో
యెఱుఁగను; జంచలాసదృశ । మియ్యది' మానులెదీని గెల్వనో
పరయున, నేను లెక్కయొకొ? ।ప్రాపునొసంగవె రాఘవేశ్వరా!

చ॥ ఎఱుఁగను లోకవృత్తముల । నించుకయైన, భవత్పదమ్ము లే
స్థిరముగ నమ్మినాఁడ; భవ । దీయకృపారసవృష్టి నాపయిన్
గురియుచు నేస్తకాఁడవయి, । కూరిమిచుట్టమవై, గురుండవై
నిరతము నన్నుఁ బ్రోవఁగదె । నీపదభక్తుఁడ రాఘవేశ్వరా!

ఉ॥ భూరిధనమ్ము లీయ, మఱి । భూముల నీయఁ బ్రశస్తమైన యా
గారములీయ, భూషణని । కాయము నీయఁ దరంబె? నేఁజమీం
దారుఁడఁగాను, దీనుడను; । దాసులకున్ మఱిదాసులైన య
వ్వారికి దాసుఁడన్ ననుఁ గృ। పామతిఁ బ్రోవుము రాఘవేశ్వరా!

ఉ॥ తల్లి యుఁదండ్రి,యన్నలును దమ్ములు, నెచ్చెలులాలుబిడ్డ లిం
కిల్లును గొడ్డుగోదలును,। వృత్తులుపొత్తులుఁ,దోఁటపేఁటలున్
గల్లలు, వీనికోసమయి । గాసిలనేల? త్వదంఘ్రియుగ్మమే
యెల్లపుడుం శుభాగ్యమని । యెంచిభజింపక; రాఘవేశ్వరా!

ఉ॥ సుందరనీలవర్ణ పరి । శోభిత తావకగాత్రశోభ యా
నందరసప్రదాయి; త్వదు । దంచితలీలలు విశ్వమోహనా
స్పందితతంత్రజాలములు; । భక్తుల కయ్యవి కర్ణపేయముల్,
చందనచర్చ; లన్యమగు । చర్చలవేటికి? రాఘవేశ్వరా!

ఉ॥ "శ్రీరఘురామ" యంచు నినుఁ । జిత్తమునన్ దలపోసినంతనే
మారుఁడుభీతిఁజెందినను। మూర్ఖునకుండును, వెఱ్ఱిమొఱ్ఱిసిం
గారములన్నిమాను,ననుఁ। గాంచుటకైన సశక్తుఁడౌను, మేల్
సారెకునాకుఁజేకురును, । జ్ఞానముదీపిలు, రాఘవేశ్వరా!

ఉ॥ పోరితిఁబోరుచుంటి, గెలు । పుంగొనఁగాఁదగుశక్తి లేక వే
సారితి,దిక్కు రాముఁడని। స్వాంతముతో మొఱవెట్టుకొంటి,న
న్నారక చిక్కువెట్టుటది యోగ్యమెనీకు? మదీయమత్తచి
త్తారభటిన్ దృటిన్ దొలఁచి । యాదృతి. నోముము
రాఘవేశ్వరా!

చ॥ "నిరతము యోగిపుంగవుల । నిర్మలచిత్తములే నివాసమై
పరఁగు రమామణీహృదయ। పంకజమిత్ర!యనాథనాథ!యు
ద్ధురకృపభక్తులన్ మనుపఁ । దోరముఁగేలధరించినట్టి, శ్రీ
హర!"యనినిన్ను నెన్నదను। హాయినినాకిఁక రాఘవేశ్వరా!

ఉ॥ ఏమని విన్నవింతు జగ । దీశుఁడవీవయి యేలుచుండ నా
నోములుపరఁడ, విట్లనఁగ । నో రెగయంగనుబోవ; దెప్పు, డే
నేమియుకార్యముల్ సలిపి । యా దృగవస్థఁ జరించుచుంటి నో
రామయతండ్రి! సైఁపు మప । రాధపరంపర రాఘవేశ్వరా!

ఉ॥ కోరితినీపదర్శనముఁ, । గోరితినీకరుణామృతంబు, నేఁ
గోరితినీపదార్చనముఁ, । గోరితినీపదధూళిమాత్రమే;
కోరనుజన్మనాశము । గూలుసురేంద్రపదమ్మునైన, నా
భారమునీదెయంటి; నెటు । పాలనసేయుదో? రాఘవేశ్వరా!

చ॥ "అలమరలేక నామనము । నాకు విహారముసల్పుచుండ్, సదా
కరమనురాగముఙ్ బరపి । జ్ఞానసుభిక్షనుఁ బెట్టు" మంచు, నే
మొఱలిడుచున్న కొద్దిను । మోసముచేసెద వేమిపాపమో!
సరెసరె విష్ణుమాయఁగల । చందమిదేగద? రాఘవేశ్వరా!

ఉ॥ కొల్చెదనీపదమ్ములను, । గూరిమినెంచెద నీదునామముఙ్,
నిల్చెదభక్తిమార్గమున । నెమ్మది, నీపయిఁ బాదుఁ గొల్పి; నన్
బెల్చననీదుసన్నిధికి । వేడుకఁ జేర్పుము నాదుపాపముల్
గూల్చి; శరణ్యమీ వెశ్రిత । కోటికి మాటికి రాఘవేశ్వరా!

ఉ॥ నీమము వేదపాఠమున, । నీమము సంధ్యల, సద్వ్రతమ్ములన్
నీమము, కాలనీమమె X । ణింపఁగ నన్నిటి మేరవెట్టు, నీ
నామమునన్ని వేళల జ । నప్రకరమ్మొకయద్దునాఁపు లే
కేమియునైన బల్కఁదగు నెంతయు భక్తిని రాఘవేశ్వరా!

# శ్రీ రాఘవేశ్వరశతకము.

ఉ॥ నీవుసమస్తలోకముల । నిండిచరించుచునుంటివంట! జీ
వావళి దుష్టశిష్టులను । నట్టివిభేద మదెట్లుగల్గెనో?
భావనసేయఁ, గర్మపరి । పాకమె యీదృశచిత్రనాటకం
బావహిలంగఁ జేసెఁ జుమ । యాశరమారక! రాఘవేశ్వరా!

ఉ॥ కర్మఫలంబుగాదివిసెఁ, । గాలముఁబుచ్చుచుఁబుణ్యపూర్తిమై
కర్మవశమ్మునన్ మరల । జ్ఞానముమాలుచుఁబుట్టిగిట్టుచున్
శర్మము లేక జీవులిటు । సంసృతిడింగుచునున్న వారికిన్
ధర్మముఁదెల్పి మోక్షము ను । దారతనీయవె రాఘవేశ్వరా!

ఉ॥ ధీరతయందునన్, మిగులఁ । దేజమునందున, శౌర్యమందునన్
గూరిమిభక్తకోటులకుఁ । గోర్కులఁదీర్చుటలోన, నిన్నునె
వ్వారును బోలఁజాల; రిఁక భక్తినినిన్ దలపోసినంతనే
తేరికి నైన మోక్షపద । మిచ్చెదుగాదొకొ రాఘవేశ్వరా!

ఉ॥ నీమముతోడఁగొల్చుమహ । నీయులఁబ్రోచి, తదీయశాత్రవ
స్తోమమువారలన్ గడఁకె । తో సముదగ్రమహాగ్రహోగ్రతే
జోమయమూర్తివై వడిగఁ । జూర్ణ మొనర్చవె? భక్తరక్ష నీ
కేమటుపాటు లేదు, సహి, । యిల్ల నిజంబిది రాఘవేశ్వరా!

ఉ॥ చేసితినెన్నొ పాపములు, । చిత్తమునందునవాని నెన్నినన్
రాసులుగాఁ గనంబడెఁజి । రంతవిషాదము రేఁచుచుండె! నా
దోసములీఁగికోఁదగిన । తోవ, భవత్పదసేవ; దానికై
దోసిలియొగ్గియుంటిఁ; బరితోషముఁ గూర్పవె రాఘవేశ్వరా!

ఉ॥ చిత్తమునీకుదర్శనవి । శేషమె కోరుచు స్వాతివానకై
ముత్తెపుఁజిప్ప వేచుగతిఁ । బొర్గిలుచుచున్డెఁ బత్తితో
నిత్తెమునిన్ను తాఁదలఁచు, । నీవెపుడాదరమూనిపోవఁగా
వత్తువొ! రానిచోఁబ్రతుకు । వమ్మగుఁజుమ్మిఁక రాఘవేశ్వరా!

ఉ॥ శాస్త్రనవర్గముల్ దనిమి, । శాంతియు, దాంతియుఁబూని, ఘోరతా
పత్రయమెల్లఁబోనడచి, । స్వాంతముఁబొజ్ఞతకిమ్ముఁజేసి లో
కత్రయనాథునిన్నెగతి । గాభజియించుచుండి ముక్తికిన్
పాత్రమయాటయన్ననది । పైపయినున్నదె? రాఘవేశ్వరా!

ఉ॥ ధారుణిఁ దుంధుధర్మమును । స్థాపనసేయఁగఁగాదె మానవా
కారముఁబూని, రాముఁడనఁ । గానొకపేరుధరించి, శక్తియై
పేరిమినొందుజానకిసిఁ । బెండిలియాడికుటుంబివైతి; వీ
వారయ శుద్ధనిర్గుణుఁడ, । వాత్మవునాదిని రాఘవేశ్వరా!

ఉ॥ తారకనామమెవ్వఁడుస । దాజపియించునో యమ్మహాత్ముఁడీ
ధారుణిపై మహేంద్రుఁడయి । తన్నుజనుల్ జయవెట్టనొప్పు; బృం
దారకలోకమందునన । నంతరమందువసించియుండి య
వ్వారిగఁబూజలన్ బడయుఁ; బ్రహ్మముతానగు రాఘవేశ్వరా!

ఉ॥ ప్రవ్రజితుండునై తము క । రమ్ములమోడిచినిన్ను భక్తి, "దే
వవ్రజనాథ! బ్రోవు"మని । ప్రార్థనసేయుమహాత్ముఁడై, నా
నావ్రతసారమై, త్రిభువ । న ప్రముదప్రదమైనయేకప
త్నీవ్రతమీవుపూనుటనె; । దీనికిమారెది? రాఘవేశ్వరా!

చ॥ తనువుల మాయభూషణవి। తానమయో! దిగవేసికొంటకై,
వనితలుఁ, బూరుషుల్, మిగుల। వంతలఁ జింతలనొంద నేల? సాం
పౌనరెడు రామరత్నమది। యొక్కఁడె జానకికంఠమున్, బ్రభం
జనసుతు మేను దివ్యకళ। జాల్కఁ జేయదె! రాఘవేశ్వరా!

ఉ॥ తౌల్యము లేదు నీకు వసు। ధాస్థలిఁ, బుత్రిక నాములెల్లరున్
శల్యములట్టి కానుపులె। సత్యము, సత్యము, సత్యమయ్య కౌ
సల్యకు వీరమాతయను। శాశ్వతకీర్తినిఁ గూర్చి, యామె వా
త్సల్యము నీవొకండ వెగ। దా కయికొంటివి రాఘవేశ్వరా!

ఉ॥ నిష్టపమందధర్మమును। వేగమె చెంపఁగఁ గోరి, పుత్రికా
మేష్టియొనర్చు పంక్తిరథు। నిష్టముఁ దీరఁగ, సంశలన్ని, నీ
కిష్టసహోదరాత్మతసు। నేర్పవహింపఁగ, రామమూర్తివై
సృష్టినలగ్చి దేవతల। ప్రీతినిఁ గొంటివి రాఘవేశ్వరా!

చ॥ అమరులు రావణాసురుని। యాగడమోర్వక భీతచిత్తులై
శ్రీమంతోలఁగన్ భవచ్చరణ। సన్నిధిఁ జేరి నిశాటుకృత్యముల్,
క్రమముగ విన్నవింపఁగను। గ్రక్కున దైత్యులఁ ద్రుంప,
వేల్పులన్
సముధికరక్తిఁ గావసర। జన్మముఁ గంటివి రాఘవేశ్వరా!

ఉ॥ తానక పాదభక్తులగు। తత్త్వవిధిజ్ఞులదూఱు వారికిన్
జావృతటస్థమానసుట। సత్యము; మానుల సాధుశీలురన్,
గావుగఁ గొన్న తాటకి, ప్ర। గాఢభవచ్ఛరధాటికోడి వా
పోవుచు వహిల్యఁ గూలు శల। భక్తినిఁ నిల్లదె? రాఘవేశ్వరా!

ఉ॥ గాధిసుతుండొనర్చుక్రతు । కార్యముధ్వంసముసేయ నెంత
యున్
గ్రోధముఁబూనిపైకొనిన । ఘోరపలాశి, సుబాహునగ్నికీ
లైధితబాణసత్త్వమున । నంతమొనర్పవెనీవు దేశికా
రాధనతత్పరత్వము ని । రంతరమొప్పఁగ? రాఘవేశ్వరా!

చ॥ తరమెనుతింప?నీపద । తామరసంపుమహత్త్వ;మద్దినా
దరతనురాతినాతిఁగ’ను । దారతఁజేసెనుగాదె! భక్తితోఁ,
శరణనియాశ్రయింపముని । సంఘమునెల్లనుమోక్షరాజ్యసు
స్థిరవిభవప్రమోదమున । దీపిలఁజేయదె రాఘవేశ్వరా!

ఉ॥ యాగముసేయఁగాఁదలఁచి । యాత్రతభూమినిదున్నుచుం
డ, నా
నాఁగటిచాలులోఁదొరకి । నవ్వరమానతియట్టులొప్ప సీ
తాగజయానఁదెచ్చియిడెఁ । దత్పరతన్ జనకుండునీకుమా
బాగని; తత్త్వవేత్తకిది । భావ్యమగున్గద? రాఘవేశ్వరా!

ఉ॥ భీమునివిల్లుఁద్రుంచితివి । భీకరశక్తి వెలుంగదిక్కులన్,
భూమిజకేలువట్టితివి । మోదమునందఁగనెల్లలోకముల్,
దోమలలీలమాడ్చితివి । దుష్టుల సజ్జనులెల్ల మెచ్చఁగన్,
గామితదాయివై శ్రితులఁ । గాచుచుసత్కృప రాఘవేశ్వరా!

చ॥ విఱువఁగనీకుభార్గవుఁడు । వెన్నునివిల్లునొసంగినప్పుడే
దరహసితాననుండవయి । తద్గురుతేజములాగికొంచు, పో
టరియొకనీవెయన్ బిరుదు । డంబుచెలంగఁగవిక్రమింపవే
యిరువురుఁదత్త్వరీతినొక । టేయని చాటుచు రాఘవేశ్వరా!

ఉ॥ పట్టముఁగట్టుకొందలఁచు । పట్టునవిఘ్నముసంఘటిల్లుటల్
మెట్టఁగనయ్యెనట్టడవి; । మేదినిపై నిటువంటినీకె ఋ
క్కట్టులురాఁగమాదృశుల । గాథలువేఱుగఁజెప్ప నేల? తొ
ల్పుట్టువునాఁటికర్మ మను । భోగ్యముజీవికి రాఘవేశ్వరా!

ఉ॥ నిందయొనర్ప వెవ్వరిని । నీవొకనాఁడును; గైకఁగాని, యా
మందరగాని నీకుఁగడు । మాన్యచరిత్రలెయైరి; నీచరి!
త్రం దలకించుచిత్రమిదె! । ధారుణి నీయవతారమాశ్రితా
నందవచోభిగమ్యము, జ । న స్తవనీయము, రాఘవేశ్వరా!

ఉ॥ కైకనహించుదుర్మతము । ఖండనఁజేసిచిరంతసంపుటి
క్ష్వాకుకులంపుగౌరవమొ । పాటియొనర్చియరణ్యవాసివౌ
నీకడకేఁగుదెంచి, గొని, । నీదగుపాదుకలర్చఁజేసె; నో
హో!కడుధన్యుఁడౌభరతుఁ । డుర్విసహిప్రతి! రాఘవేశ్వరా!

చ॥ అహితముమాన్చిలోకమున । కభ్యుదయంబుచుగూర్చువానితో
విహితముఁగల్గువానిదె ప । విత్రభవమ్ముగు;నాఁడువాహినీ
గుహుఁడుతరింపఁజేసినిను । గొల్చి, సఖుండయి, శాశ్వతమ్ముగా
నిహపరసౌఖ్యముల్ గనఁడె । యొంతయువింతఁగ? రాఘవేశ్వరా!

ఉ॥ క్ష్మాజయు,నీవుఁ,దమ్ముఁడును। గానలకేఁగుచునుండుచోభర
ద్వాజమహర్షి సత్తముఁడు। వన్యఫలంబులెయిచ్చి, వెండిమీ
రాజిజయించివచ్చునెడ । నాదరమొప్పఁగవిందువెట్టె; రా
రాజవునేఁడు, నాఁడుముని । రాజవుగావొకొ! రాఘవేశ్వరా!

ఉ॥ సేవకధర్మసంహితయె । చెన్నగు నల్ల సుమిత్రసూతిదౌ
జీవితమెన్న, నోగులును । సేగులునొక్కవిధాననోర్చి, సం
భావితుఁడయ్యె రామనర । పాలునిచేతను, సీతచేత; నా
హా! విధియెట్టిచిత్రమొ! మ । హాత్మకుఁడాతఁడె రాఘవేశ్వరా!

ఉ॥ ఏవముఁగొల్పుచున్, శ్రమల । నేఁచును సేవకవృత్తి; హా! యహం
భావపిశాచబద్ధులగు । వారల, భూవిభునామధారులన్
భూవలయమ్మునన్ గొలిచి । పొక్కఁగనేల? నిజప్రభుండవౌ
నీవరివస్యఁ జేయుచును । నీచతఁబాయుము రాఘవేశ్వరా!

ఉ॥ ఊరకయున్నదమ్ములయ । యో! యిపుడాస్తులకోసమెంత
యున్
గోరుటులెక్కవంశముల । గొప్పదనంబడగించుచుండ్రి; పెం
పారఁగ మీసహోదరత । యాడలిపొందిక సంగ్రహిం
చుచున్
వైరిచయోద్ధతిన్ గెడపి । వర్థిలరాదొకో? రాఘవేశ్వరా!

ఉ॥ "శాసయొనర్తునీకుసరి । వచ్చుదయానిధి లేఁ"డటంచుఁ గా
కాసురు నీవుఁ బ్రోచినయు । దంత మెచాలదె? మాకుఁ బూర్ణని
శ్వాసము నీయెడన్ గొలుపఁ, । బాపిని నీశరణంటిఁ బ్రోవుమా
దాసరి తప్పులన్నియును । దండముతో సరి రాఘవేశ్వరా!

ఉ॥ కామముకై పుసేయుట నెఁ । గాదొకొ మున్నలచుప్పనాతి, "ము
క్కోమలి, మొజ్జా! నాముచెవు । లో" యనికుయ్యిడనయ్యె
ధర్మమే
సేమముఁ గూర్చి కాచుఁ దిఁ; । స్త్రీజనమీహయు నీగహాస్యమున్
వేమననంబొనర్పఁబకుఁ । బెంపువహింపఁగ రాఘవేశ్వరా!

చ॥ గణుతికి యొసఁగఁ జాలఁగలి । కాలవికారము లేను; నేఁడు శూ
ర్పణఖలె, కామరూపిణులె । గ్రాలుచునుండిరసంఖ్యగాఁగ దా
రుణగతిఁ గేస్తు రాంద్రగుచు! రోఁత యడంగఁగఁ, దొంటికీతిశి
క్షణ మొనరించి ధర్మమును । గావఁగఁ బూనవె రాఘవేశ్వరా!

ఉ॥ మానులయాశ్రమస్థలుల । ముట్టను బెట్టుచు దైత్యులన్, జన
స్థానమునందు శూర్పణఖ । తాత్రము భంగము నొందఁ గూల్చ వే
నీనిశితాస్త్రిపాండితిని । నెక్కొనఁ జేయుచు? నింటియొద్దనీ
వీని యనుంబుఁ బూనిగద । యేఁగితిదండక? రాఘవేశ్వరా!

ఉ॥ మాయలు నీకు దర్ బయిసి । మూలవె? నాఁడలమాయలేఁడియ
ట్లాయసురుండు నిర్ శ్రమల । నందఁగఁ జేసి నశింపకుండెనే?
యాయువుపూర్ణమై పలువ । లాన్యులవంచన సేతురక్కటా!
శ్రీయము వాక్కెప్పగిదిఁ । జేకులునోఁగద? రాఘవేశ్వరా!

ఉ॥ భిక్షుకవేషమూని, పృథి । నీసుత నెత్తుకపోయి, నిన్ను నెం
తో క్షుభితాత్మఁ జేసియుల । దుష్టుఁడు, రావణపాతకుండహో!
తాక్షయమొందఁడే? యటులె । ధర్మగతిన్ విఘటించఁ జూ
చినన్,
శిక్షలనొందకుండునొకొ । జీవసమూహము? రాఘవేశ్వరా!

చ॥ శుభకరమౌ పదమ్ములను । జూపి ముదంబిడి, మోక్షమార్గ పహా
నభయము నా జటాయువున । కాదర మొప్పనొసంగినట్లు, నేఁ
డభయముగాఁగ నీవును, ధ । రాత్మజయున్, మఱిలక్ష్మణుం
డు, నవ్
రభసముతోడఁ బ్రోచుటకు । రావలె వేఁడెద రాఘవేశ్వరా!

చ॥ “గబగబచిన్ని రాఘవు లె । కాయెకి నేఁగనవచ్చుచుండిరం
టఁ! బహుకృతార్థతం దనరె । నాభవ”మంచును దీపిపండ్ల నే
దబదబ నేఱి తెచ్చినను । దంబున నీకుపహారమిచ్చి, యా
శబరి పవిత్రయయ్యె; నదె ! సార్థకజన్మము రాఘవేశ్వరా!

చ॥ సుతుఁడనటంచు నెవ్వఁడేటు । సుద్దులువల్కనఁబల్కనిమ్మ, సం
తతరుచిరార్ద్రితావకప । దద్వయిఁగొల్వకయున్న వాఁడు స
ద్గతి నెటులందనేరుచుఁ? ప్ర। గల్భపుమాటలఁగార్యమౌనె? దా
సత మొయిఁగాదె మారుతికి । సంతసమబ్బెను? రాఘవేశ్వరా!

ఉ॥ పామరుఁడే మెఱుంగును భ । వన్మహిమోన్నతిఁ? జెట్లుకొట్టియో
సాముఁ జేసియో, చదల । చక్కఁగ ఖేబర మేఁగ మీటియో,
వేమఱు నమ్మకమ్ము ప్రభ । వింపఁగఁ జేయనెఁగోరుచుండు నీ
నామమె చాలుఁ బోవ; బెర । నాటకమేటికి రాఘవేశ్వరా!

ఉ॥ “అందెలుజానకమ్మవె, త । దన్యవిభూషలెఱుంగ; నామెకున్
వందనమేను జేయుతరు । గమ్మనఁజూచితి” నంచుమాతృభ
క్తిం దగవానరాళిపుల । కింపఁగఁ దెల్పఁడె? లక్ష్మణుండు; స
ద్వందితశీలుఁడట్టిఁడొక । తమ్ముఁడుచాలఁడె? రాఘవేశ్వరా!

ఉ॥ వాయుసుతుండు నీపరమ । పావన తారకనామమెప్పు, బా
రాయణఁ జేసి, మాయనుబి । రాసనిరాకరణంబొనర్చి, దీ
ర్ఘాయువునొంది, భావికమ । లాసనపట్టముఁగాంచి మించు భా
గ్యాయతిఁజెందె; నాకెపుడొ । యట్టిశుభస్థితి? రాఘవేశ్వరా!

ఉ॥ వాలినిఁజంపి భాస్కరుని । పట్టికిఁబట్టముఁగట్టుచుఁ, జగ
జ్జాలమెఱుంగఁజాటవొకొ? । "జాల్మునిఁద్రుంపఁగ, దాసు నేలఁగన్
గేలనుగంకణంబిపుడు । నేధరియించితి"నంచు; నౌర! నీ
లీలలుధర్మసంభృతము । లేగడచూడఁగ రాఘవేశ్వరా!

ఉ॥ శీలము లేనివారలకుఁ । జేకుఱఁబోవ నునీకుప్రేమ; మఱిన్
వాలియధర్మమార్గమున । వర్తిలుటన్ గదనీకు వైరియై
గూలెను నీదుబాణమున । ఘోరతరంబుగ నాటుకొంట; ను
త్తాలబలంబుధర్మపర । తంత్రుని దేసుమ రాఘవేశ్వరా!

ఉ॥ అంతటిభక్తుఁడై నపవ । నాత్మజునేనియునంటనీక, దై
త్యాంతకునిన్నుఁదెచ్చి, రణమందునరావణుఁద్రుంచి, తన్ను శు
ద్ధాంతముఁజేర్చుచున్న జన । కాత్మజశీలమునిస్తులంబు, రా
ద్ధాంతులుఘుర్ఘురించినను । దక్కవవచ్చునె? రాఘవేశ్వరా!

ఉ॥ కోఁతులునీకథల్ వినుచు । గొబ్బునఁబుట్టినదంటకున్న సం
పాతికిఱెక్కదోయి! యటు । వంటివెయౌనవునీచరిత్రముల్!
చేతనతన్ జడమ్ములకుఁ । జేకుఱఁజేయసుధాస్రవంతియౌ
నీతనువొందెఁజూ తెలియ । నేర్తురెయజ్ఞులు? రాఘవేశ్వరా!

ఉ॥ పొంగుచుఁద్రోవవెట్టని స । ముద్రునిరింగు నడంగఁజేసి, సా
ష్టాంగనమస్కృతుల్ గొనవె; । యారయనీకెదురన్నదెక్కడే
నింగలదొక్కొ? సర్వమును । నీకుజొహారె; మహాప్రభుండ, వు
త్తుంగకళాస్వరూపివి, వి । ధూతపలాశివి రాఘవేశ్వరా!

ఉ॥ సేతువుఁగట్టుచో నుడుత । చేసిన సేవయె మెచ్చుకొన్న నీ
వీతటి నేనొనర్చుభవ । దీయ్యకథాకథనంబు నెంచి, స్నే
హాతిశయమ్ము నించి, సత । తాభ్యుదయమ్ము ఘటింపకుందువే
చేతలభక్తి నిండు నెడఁ । జేకొనర్హము రాఘవేశ్వరా!

చ॥ కొలువఁగ రా, విభీషణుఁడు । కుఁ శరణాగతిఁ గూర్పవే? మదిన్,
దలఁపఁగఁ బోక వైరికినిఁ । దమ్ముఁడటంచును లంకవానికిన్
దొలుత నెధారవోసితివి, । దొడ్డప్రభుఁ బొనరించినాఁడ వా
వల; సముదారచిత్తుని ప్ర । వర్తనమిట్టిదె రాఘవేశ్వరా!

చ॥ నిమరను లేవఁగొట్టి, కడు । నిష్ఠురముల్ పలవించిరావణుం
డదయతఁ గుంభకర్ణుని ర । ణావనికంపె నెకాని వాఁడు నీ
ప్రదరము సోఁకి త్రెళ్లఁగద; । పాపికి పాయము జేయబూనె నే
నది విజయంబునొంద నొకొ? యట్టిటులై చను రాఘవేశ్వరా!

చ॥ మునుపల పాకశాసనుని । ముప్పులు వెట్టితినన్న గర్వమున్
గొని, యనిఁదాఁకు నింద్రజినిఁ । గూల్చఁడె? యొక్క క్షణమ్ము గోన నీ
యనుజుఁడు లక్ష్మణుండు; నిజ । మారయఁగాన తఁడాది శేషుఁడే;
చెనకఁగ నేరికా తనిని, । స్వీకృతదీక్షుని? రాఘవేశ్వరా!

ఉ॥ రావణుతోడి యుద్ధమున । లక్ష్మణుఁడొక్క టమూర్ఛ నొందినన్,
బావని, నీశ్వరాంశజునిఁ । బంపి యతండొగిఁ దెచ్చినట్టి సం
జీవినొసంగి, వేగము స । చేతను జేసినయట్లు నామదిన్
నీవు కృపాసుధా ప్లుత న । నిద్రితఁ జేయుము రాఘవేశ్వరా!

ఉ॥ నిన్నొకమర్త్యునట్లుగ । గణించుచునుండిరి కొందఱజ్ఞులై;
కన్నులువిప్పి నీచరితఁ । గన్గొనిరేనియు వెన్నుఁడీవెఱుం
చున్నిజమెల్లఁదెల్లమగుఁ । జన్మదివాంధము వెల్గుఁజూడలే
కున్నటులున్నవారివచ । నోద్ధతిలెక్కయె? రాఘవేశ్వరా !

ఉ॥ దేవునిబిడ్డడంచునుబ । డింబడినొక్కనిఁ జెప్పుచున్న మా
యావులబోధలింతయు మ । దాత్మనుసోఁకవు; దేవదేవుఁడా
నీవెస్వయంభువై యొగుటనిల్చుచు । మాకభయంబొసంగనీ
సేవయెసేయకన్యులను । జేరఁగనేటికి ? రాఘవేశ్వరా !

ఉ॥ కోఁతులమూఁక, నయ్యెలుఁగు । గొడ్డులఁగొల్చువాడు కాం
డుప్రగాఁగసం
ప్రీతిగ్రహించి వారినిఁ ద । రింపఁగఁజేసిననీకు మానవ
వ్రాతమునోముటన్నొక। భ్రాంతియె?నీయవతారముర్విపై
ఖ్యాతిగధర్మమున్నిలుపు । కాంక్షనెగాదొకో ? రాఘ
వేశ్వరా ?

ఉ॥ రోసమునీకుఁగొల్చుచు వి । రోధమెవాఁడునహించువానికిన్
శ్వాసలునాఁటితోసరె; సు । పర్వవిరోధులపాట్లుసూడమే?
రాసులురాసులై ధరణి । రాలరొకో శలభాళియట్లు ? నీ
శాసనధాటియొంతయును । జండతరంబగు! రాఘవేశ్వరా!

ఉ॥ ధాతృఁడునీకు,సీతకుని। జమ్ముఁగఁబుత్రుడు;భక్తియుక్తిసౌ
మిత్రిప్రసేవలన్జలిపి, । మిమ్మలరించి, కృతార్థుఁడయ్యె;సౌ
భ్రాత్రపుదిక్కతండు వన । వాసపువేళల బ్రహ్మచారియై
శత్రుహిజేతయైగురుల । సన్నుతులొందఁడె? రాఘవేశ్వరా!

చ॥ దశముఖకుంభకర్ణులను, । దత్సము లెందఱినో యడంచి నీ
విశదయశస్సుమ్మది కర్తుల । బెంపుగఁ బర్వఁగఁ జేసియుండుటల్
విశదముగాదె; యవ్విధిని । పీడక మామక పాపపుంజముల్
బ్రశమనమున్ బొనర్పఁగదె । వైశమనీదయ రాఘవేశ్వరా!

ఉ॥ ఆరటమొందుచుండి పురు । పార్థములం గ్రదృతీయమున్
గొనం,
గాఋజుమార్గమున్ విడిచి, । కావర మెచ్చి, స్వజాతిధర్మముల్,
నీఱొనరించియావనులు । నేఁడకటక్కటా! నీవు రావణున్
మారణముంబొనర్చుక్రియ । మర్మమెఱుంగరో ! రాఘవే
వేశ్వరా !

ఉ॥ సీతనినున్ హృదీశునిగఁ । జేకొనిహర్షముఁగన్నయట్లు, సా
కేతపురీలలామ తుల । కించెనుదావక పాణిపీడనన్
బ్రీతివహించి; పత్నికినిఁ । బ్రేముడి దాఁపని భర్తకంబె సం
ప్రీతినొసంగుపట్టిదిఁక । వేతెదియున్నది? రాఘవేశ్వరా !

ఉ॥ సీత, త్రిలోకమాతనిన । సింహఁగ నీదగువామభాగమం
దాతతర కీర్తి రాముఁడవు । నైభువనావనముంబొర్చుచున్
వాతసుతున్ ద్వదర్చనలఁ । బల్లవితాత్మునిఁ జేయునిన్ను మ
చ్చేతమునన్ భజింతునుధృ। తిన్ బరమాత్మగ! రాఘవేశ్వరా!

చ॥ పతిపదపద్మసేవనమె । భారతయోవతధర్మముంచు నూ
ర్జితమతిఁదా మెఱుంగరొకొ : సీతచరిత్ర పఠించియేనినేఁ
డతిధృతిస్వేచ్ఛకై పెనఁగు । లాడెడి స్త్రీజనమెల్ల; నేటినిం
ద్యతమ నవీననాగరిక । తన్ విడుటొప్పదె? రాఘవేశ్వరా!

ఉ॥ జానకితొల్లి వేదవతి । చందమునన్ జరియించువేళ దు
ర్మాని, పలాశి, రావణుఁడు । మానముభంగముసేయఁబూ
నినన్
వానిశపించి, స్వీయతను । వహ్నిఁదొఁగంగి, పునర్భవంబునన్,
బూనినపూన్కిఁదీర్చుకొనె! పో! సతులల్పులె? రాఘవేశ్వరా!

ఉ॥ జాలిరవంతయేనియును । స్వాంతమునన్ గొనకీపు నిండుచూ
బాలిని ఘోరకానలకు । నంపితివంచునుగొందఱిత్తఱిన్
జాలఁగఁదిట్టిపోసెదరు । సత్యమెయైనఁగక; నీవుభూప్రజా
పాలనమేప్రతంబుగను । వర్తిలినాఁడవు రాఘవేశ్వరా!

ఉ॥ సీతమ, పావసత్వమునుఁ । జింతయొనర్పక కొందఱిప్డు, దు
ర్జాతులశోకవాటికను । జానకిరావణుతోడ మోహపుం
జేఁతలుజేసినట్లువిర । చించి, సమర్థనకోసమేవిరో
కూఁతలుకూసి; శాఖలుల । గ్రివ్వెటుడిందునో ? రాఘ
వేశ్వరా!

ఉ॥ ప్రేలుడుగాయవైరజక । భీరుఁడుకానలఁదోసియుఁజేసి, గ
ర్భాలసయైనజానకిని ॥ నారడివెట్టెనునాఁడు; నేఁడు వా
చాలసమాజమాపలువ । జాడనుగావ్యమెఁగూల్పనుండెఁ; ధీ
జ్వాలదహింపకుందునొకొ । సంకరజాతిని? రాఘవేశ్వరా!

ఉ॥ ఎంతయొపావనత్వము వ । హించినదౌటనె సీతకాలిడన్
శాంతమునొందెనగ్నిశిఖ;! జ్ఞానముముందటమాయనిల్చునే?
యంతమునొందరే?సతులు! యాదలనిందలమోపి,వారలన్
వంతలఁబెట్టుదుర్మతులు । వంశముచెల్లఁగ; రాఘవేశ్వరా!

చ॥ పొలుపగు ధోరణిన్ గుశల । పుల్ భవదంచితగాథఁ బాడఁగాఁ
బుంకలు పుట్టెనీ మొఱ్ఱని । బొంపిరివోవఁగఁ, బుట్టపట్టెగా
జిలిబిలికైతలోఁ దొలఁకు । చెల్వొటువంటిది; నీమనంబునన్
దెలియఁగరాక తోఁచుతరి । తీపటువంటిది! రాఘవేశ్వరా:

ఉ॥ జననముఁగన్నదే మొదలు । సత్యనిరీక్షణ దీక్షనొంది, నిన్
మనమునఁగొల్చు మానులకు । నమ్రతఁదోడయి రాక్షసావళిన్
బనిఁగొనియుగ్రకూపమున । భంజనసేయ, నమర్త్యులెల్లహో
యనిఁగని పుష్పవృష్టిఁగురి ః యుంపరె నీపయి? రాఘవేశ్వరా

చ॥ ద్విజులుద్విజిహ్వలక్షణము । తిత్వరితమ్ముగ నీడి సత్యవా
గ్ధ్వజమువహించి ఘోరకలి । దైత్యునినొంపఁగ సాధనోజ్జ్వల
ధ్వజనిని వెంబడింగొనుచు । దాఁకితమగ్రత రాహవంబునన్
విజయమునొందిమించుకర ణింగరుణింపుము రాఘవేశ్వరా!

ఉ॥ నామములెల్ల నీకిలన । నంతములౌనిఁక నందొకండు ని
ష్ఠామతితో జపించునెడ । సర్వశుభంబులు గుంపుగుంపులై
తామయి, చేరవచ్చుఁ; గుది । దప్పక వానికినొప్పు ముక్తి హ
స్తామలకంబుగాఁగ; నమ్ర । తాక్షరమూర్తివి! రాఘవేశ్వరా

ఉ॥ వేములపార్వతీశునకు । వేంకటరత్నమ కగ్రపుత్త్రుడన్,
నీదగుసేవఁగోరుచును । నిత్యము వేంకటశాస్త్రిపేర ని
మ్మేదిని నారధర్మమున । మించెడువాఁడ, బుధాంఘ్రిరేణు సం
పాదనతత్పరుండనయి । వర్తిలువాఁడను రాఘవేశ్వరా సం!

చ॥ జయజయజానకీహృదయ! సాంసపూషణ! సాధుపోషణా
జయజయసర్వమానిబుధ! సంచయరంజన! దైత్యభంజనా
జయజయవాయుపుత్రి పః! సర్పితపాద! దయాంగసాస్పదా
జయజయసచ్చిదాత్మక! సు! జాత్యభిరక్షక! రాఘవేశ్వరా

ఉ॥ మంగళమయ్యనీకు, శుభ! మంగళమయ్య మహీతనూజ
కున్
మంగళమయ్య మారుతికి! మంగళమయ్య త్వదా ప్తకోటి
కిన్
మంగళమయ్యతీర్థులకు, మంగళమయ్య త్వదర్చకాళికిన్
మంగళమయ్యయాంధ్రకవి! మంగళికొప్పగు రాఘవేశ్వరా

ఉభయభాషాప్రవీణ, ప్రస్తావధాని,

వడ్డాది సీతారామాంజనేయులుగారు (భీమిలి కోట)

చ॥ తరళము దివ్యకావ్యమణిదామసముష్టిని, జానకీమనో
హరగుణభాసురంబుగ, బవనాత్మజధీసురభిప్రకీర్ణ, మ
ధుర, మమృతైకత త్త్వరుచికాండవిరాజిత మార! రాఘవే
శ్వరునిచరిత్ర, మెందఱెటు వర్ణన సేసినఁ దేజరిల్లదే?

# పరిశోధనము.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 7 | దాశరథీశతకమ్ముఁజెప్పె | దాశరథిస్తుతికావ్య మల్లె |
| ,, | 14,15 | శ్లోకుఁడునై, శోభియునై పాదుఁడునై | శ్లోకుఁడుగా, శోభియుఁగా, పాదుఁడుగఁజె |
| 3 | 1 | దారుఁడును | దారుమఱి |
| ,, | 16 | నలర్చును | నలర్చుచు |
| 4 | 7 | ఘనస్వరూపివగు | ఘనాకృతిం బరఁగు |
| ,, | 17 | మైనయా | మా శుభా |
| ,, | 19 | దారుఁడ | దారును |
| 5 | 6 | త్వదుదంచిత | త్వదనర్గళ |
| ,, | 16 | దృటిఁ | ద్రుటిఁ |
| ,, | 18 | మణీ | సతీ |
| 6 | 12 | సరెసరి | సరిసరి |
| ,, | 15 | వేమకఁజే | వేగముచే |
| ,, | 18 | కాలనీమమె | నీమమే కద |
| 7 | 10 | దీర్చుటలోన | దీర్చుటయందు |
| 8 | 13 | వునాదిని | వనాదివి |
| 9 | 11 | నేర్పు | నేపు |
| ,, / 15 | 15 / 2,11 | దృంచి | ద్రుంచి |
| 9 | 17 | ఁగంటివి | నెత్తితి |
| ,, | 20 | తాటకి | తాటక |
| ,, | 21 | వహ్ని గూలుశలభకీ(ర్తి)య నీల్గదె? | వహ్నిలో మిడుత శోలికఁగూలదె? |